# ఆక్సిజన్

## వచన కవితా సంపుటి

యువభారతి రజతోత్సవ ప్రచురణ

రచన

డా॥ నాగినేని భాస్కరరావు, M.B.B.S. (OSM)




యువ భారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
తిలక్ రోడ్, హైదరాబాద్-500 001

POETRY ANTHOLOGY

Written by Dr. Nagineni Bhaskara Rao, M.B,B.S. (Osm)
Ex-Vice President, Member Yuva Bharathi
Madhira (PO), Khammam (Dist)
Pin 507 203



Yuva Bharathi Silver Jubilee Publication
Under Self Financing Scheme

Publication No : 134
First Edition : 4th August 1991
Copies : 1000
Cover Design : Sri Seela Veerraju

Price : Rs. 12-00



Printed at :

PRAJASAKTI PRESS
Printers and Binders
Marxist Karyalayam,
Akulavari Street,
VIJAYAWADA-520 002

For Copies :

YUVA BHARATHI
(A Literary & Cultural Organisation)
Andhra Saraswatha Parishad Buildings,
Tilak Road, HYDERABAD-500 001



# యువ భారతి
# రజతోత్సవ సాహితి

1963 విజయదశమినాడు ఆవిర్భవించింది యువభారతి. దాదాపు డెబ్భై మంది యువభారతీయుల సంఘటిత స్నేహశక్తి యువభారతి. 1990–1991 సంవత్సర కాలంలో రజతోత్సవాలను నిర్వహించుకొంటున్నది.

'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవటం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించటం మంచిది' – అన్న సూక్తిని జీవశక్తిగా రూపొందించుకొని, సమకాలీన సామాజిక, సాంస్కృతిక, సాహిత్య రంగాలలో సముచితమైన, శాంతియుతమైన, నిర్మాణాత్మకమైన చైతన్య పాత్ర యువభారతి నిర్వహిస్తోంది.

సాహిత్యం ఎటువంటి సాహిత్యేతరశక్తుల ఆజమాయిషీకి లోనుకాకుండా, స్వతంత్ర వ్యక్తిత్వంతో సమాజంలో బలవత్తరమైన సాత్త్విక శక్తిగా రూపొందాలనీ, సాహిత్య గౌరవం రచయితల వ్యక్తిత్వం మీద ఆధారపడి ఉంటుందనీ, ఉన్నత సాహితీ వ్యక్తిత్వం నిర్మాణానికి కావలసిన ఆలోచనలను, భావాలనూ, రచనా విశేషాలనూ సరళ భాషలో, సామాన్య ప్రజానీకానికి కూడా అందుబాటులో ఉండేటట్లు వివిధ కార్యక్రమాల ద్వారా, ప్రచురణ ద్వారా యువభారతి యత్నిస్తోంది.

సాహిత్యంలో పరిణామం సహజం. పాత పద్ధతులు మారి కొత్త ఉద్యమాలు వస్తూ ఉంటాయి. వాటి మధ్య భావసంఘర్షణ తప్పకుండా ఉంటుంది. ఆ మథనంలో గతంలోని మంచినీ, వర్తమానంలోని నవ్యతనూ, భవిష్యత్తుకు కావలసిన శ్రేయస్సునూ జాతిదృష్టికి తీసికొని వచ్చి సాహిత్యం మీద సమాజంలో ఒక సదవగాహననూ, సమభావాన్నీ, ఆస్వాదనాసక్తినీ, గౌరవభావాన్నీ పెంపొందించటమే సాహిత్యోద్యమంగా చేపట్టి యువభారతి ముందుకు నడుస్తోంది.

ఇరవై యేడేళ్ళుగా యువభారతి పైలత్యాలు ప్రతిబింబించే కార్యక్రమాలను చేపట్టింది. ప్రజలకు దగ్గరగా ప్రవహించే సాహిత్యాన్ని ప్రచురిస్తోంది. తెలుగు వారి హృదయాలలో ఒక మరుపురాని మమకారాన్ని పదిలంగా నిలుపుకొంటోంది. ప్రజల నడుమ వెండి పండుగ వేడుకలు జరుపుకొనే ప్రయత్నం చేస్తోంది.

రజతోత్సవాల కాలంలో 25 ప్రచురణలను వెలువరించాలని యువభారతి లక్షించింది. ఇప్పటికే పన్నెండింటిని ప్రజల ముందుంచింది. ప్రతినెలా మొదటి

ఆదివారం సాయంకాలం 'సమాలోచనం' కార్యక్రమం నిర్వహిస్తోంది. ఆచార్య సి. నారాయణరెడ్డిగారి చేత ప్రజాచైతన్యం కలిగించే అంశాల మీద జనరంజక ఉపన్యాసాలను 'లహరి' పరంపరలో ఈ యేడు ఏర్పాటు చేస్తోంది. విలువైన రజతోత్సవ సంచికను ప్రచురించే యత్నం సాగిస్తోంది.

యువభారతి సభ్యులు డాక్టర్ నాగినేని భాస్కరరావుగారు. వీరి మాట, చేత, కవిత ఉత్సాహానికి ఊపిరి. సుధామతో కలిసి వీరు 'మేం' కవితా సంపుటిని యువభారతి ద్వారా ప్రచురించారు. అభ్యుదయభావ చైతన్యాన్ని కవితా శక్తితో అందించ గలిగిన బలమైన కలం, గళం భాస్కరరావుగారికి సహజంగా ఉన్నాయి. వృత్తికి డాక్టరై, ప్రవృత్తికి కవియై సమాజాన్ని రెండురకాలుగా చికిత్స చేస్తున్నారు. నేటి ఈ కవితా సంపుటి 'ఆక్సిజన్' స్పృహతప్పిన సమాజానికి జీవశక్తి. ఈ సంపుటిని యువభారతి రజతోత్సవ ప్రచురణగా వెలువరించటానికి అంగీకరించిన మిత్రులు డాక్టర్ నాగినేని భాస్కరరావుగారికి కృతజ్ఞతలు.

ఈ సంపుటికి ముందుమాట వ్రాసిన ఆచార్య చేకూరి రామారావుగారు ఆధునిక తెలుగు సాహిత్యంలో ఆలోచిస్తున్న కొద్దిమంది విమర్శకులలో ఒకరు. వారు ఒక కొత్త బాటలో నడిచే అడుగుల చప్పుడు అక్షరాలకు వినిపిస్తున్నారు. 'ఆక్సిజన్'కే విలువ కట్టిన షరాబుకు యువభారతి కృతజ్ఞతలు.

యువభారతి రజతోత్సవ సభ్యులుగా చేరండని సహృదయులను ఆహ్వానిస్తున్నాం: 1991లో నూరు రూపాయలు చెల్లించి, 1995 చివరిదాకా యువభారతి ప్రచురణలపై 40 శాతం తగ్గింపు పొందవచ్చు. వారికి రజతోత్సవ సంచిక ఉచితం. రచయిత(త్రు)ల రచనలను 'సెల్ఫ్ ఫైనాన్సింగ్ స్కీమ్' క్రింద యువభారతి ప్రచురించి విక్రయిస్తుంది. యువభారతి మీ సహాయ సహకారాలను ఆహ్వానిస్తున్నది. రజతోత్సవాలను విజయవంతం చేయండి. రజతోత్సవ కానుకగా ఈ ప్రచురణను అందుకోండి.

హైదరాబాదు,
4-8-1991

జి.వి. సుబ్రహ్మణ్యం,
అధ్యక్షుడు.

# అంకితం

## మరువరాని ఆప్తమిత్రులు



**కీ॥ శే॥ డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి M.A., Ph.D. గారికి**

# నా మాట

సమాజంలో జరిగే ప్రతిఘటన పట్ల, ప్రతిఘటనపట్ల కవి హృదయం స్పందించటం నాటి వాల్మీకి నుండి నేటి కవి వామ్మేరా వరకు వర్తిస్తున్నదే. ఆ స్పందనలో పుట్టిన కవిత్వం రకరకాలు – ఆత్మానందం కోసం, సమాజ శ్రేయస్సు కోసం; ఇవి రెండూగాక కొన్ని అసందిగ్ధావస్థలోనూ ఉన్నాయి. నేను విద్యార్థి దశలో కవిత్వం గురించి, వాటి ధోరణుల గురించి చదువుకొని ఉత్సాహంగా వచన కవితా రచన ప్రారంభించాను. 1969లో యువభారతి సభ్యుడుగా చేరిన తరువాత సాహిత్యంతో మరింత సన్నిహిత సంబంధం ఏర్పడటమేగాక 'సింధూరం' (యువభారతి ప్రచురణ), "తరంతరం" (ఫ్రీవర్స్ ఫ్రెండ్, హైదరాబాద్ వారి ప్రచురణ) సంకలనాల సంపాదకత్వంలో ప్రధాన బాధ్యత వహించటం జరిగింది. 1974లో మిత్రుడు 'సుధామ'తో కలసి "మేం" అనే కవితా సంకలనాన్ని వెలువరించాను. ఆ తరువాత వృత్తిరీత్యా మధిర పట్టణమునకు రావటం జరిగింది. మధిరకు వచ్చిన తరువాత అప్పుడప్పుడు వ్రాసిన కవితలను మిత్రులకు విన్పించటం, బాగున్నవనుకున్న వాటిని పత్రికలకు పంపటం, ప్రచురింపబడటం జరిగింది. వాటిని ఒక సంకలనంగా తీసుకొనివచ్చే ప్రయత్నం చేశాను. ఈ ప్రయత్నంలో ఎంతవరకు సఫలుడనయ్యానో నిర్ణయించవలసింది విమర్శకులు, పాఠకులు.

ఈ సంకలనంలోని కవితలు భారతి, ప్రజాశక్తి (ఆదివారం అనుబంధం), ఆంధ్ర జనత, చెకుముకి, నందిని, అధ్యయన వేదిక (మధిర) ప్రచురించిన ప్రత్యేక సంచికలు, ఐక్య ఉపాధ్యాయ మొదలైన పత్రికలలో ప్రచురించబడ్డాయి. నన్ను ప్రోత్సహించిన ఆయా పత్రికల యాజమాన్యమునకు, సంపాదకులకు నా హృదయపూర్వక ధన్యవాదములు. ఈ సంకలనాన్ని వెలువరించడంలో కవితలను ఎంపిక చేయటంలోనేగాక ముఖచిత్రాన్ని అందంగా రచించిన ఆప్తులు, శ్రేయోభిలాషులు శ్రీ శీలా వీర్రాజుగారికి కృతజ్ఞతలు. దూరంగా వున్నా సాహిత్య స్ఫూర్తిని ఇవ్వడమేగాక కార్యదక్షతను నేర్పి నా కవితా వ్యాసంగానికి ప్రోత్సాహమిచ్చి యీ సంకలనాన్ని రజతోత్సవ ప్రచురణగా ప్రచురిస్తున్న మా సంస్థ 'యువభారతి'కి ముఖ్యంగా అధ్యక్షులు ప్రొఫెసర్ జి.వి. సుబ్రహ్మణ్యంగారికి, ప్రొఫెసర్ వంగపల్లి విశ్వనాథంగారికి, ఈ సంకలనాన్ని త్వరగా వెలువరించ

టానికి అన్ని విధాల సహకరించిన ఆప్తమిత్రుడు యువభారతి కార్యదర్శి శ్రీ ఎన్. వెంకటేశ్వరరావుగారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

నేను కోరినదే తడవుగ స్క్రిప్టు చదివి 'పీఠిక'ను వ్రాసిన సహృదయులు, ప్రముఖ విమర్శకులు ప్రొఫెసర్ చేకూరి రామారావుగారికి కృతజ్ఞతాభివందనాలు.

వ్రాతపతిని తయారుచేయుటలోనేగాక హార్దిక, ఆర్థిక సహకారము నందించిన ప్రియమిత్రులు శ్రీసి.వి.ఎల్.నరసింహారావు, మధిరగారికి, ఆర్థికసహకార మందించిన సహృదయులు కళాబంధు శ్రీ అవసరాల శ్రీరామ సత్యనారాయణ, A.E. మధిరగారికి, మిత్రులు శ్రీ తోట వెంకటేశ్వరరావుగారికి సర్వదా కృతజ్ఞుడను. ఈ సంకలనం ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించిన శ్రీ శీలా వీర్రాజుగారికి, గ్రంథాన్ని ఆవిష్కరించి ముఖ్య అతిథిగా విచ్చేసిన ప్రముఖకవి శ్రీ కె శివారెడ్డి గారికి, కవితా సమీక్ష చేసిన కవిమిత్రులు శ్రీ కె. శ్రీనివాస్, శ్రీమతి కె.బి లక్ష్మి, శ్రీ జి. కుమారస్వామినాయుడుగార్లకు నా కృతజ్ఞతలు.

సకాలంలో పుస్తకాన్ని, ముఖ పత్రాన్ని అందంగా ముద్రించిన "ప్రజాశక్తి" ప్రెస్, విజయవాడ ముఖ్యంగా శ్రీ డి. నారాయణప్రసాద్ గారికి నా కృతజ్ఞతలు. ఈ పుస్తక ముద్రణ బాధ్యతలో పాలుపంచుకున్న చిరంజీవి నాగినేని రాధాకృష్ణయ్య, చిరంజీవి పేరిశెట్టి నాగభూషణంలకు నా ఆశీస్సులు.

స్నేహశీలి, సాహితీవేత్త స్థిరప్రజ్ఞుడు అమరణ పర్యంతము 'యువభారతి' అధ్యక్షులు మరువరాని మిత్రులు కీ॥శే॥ డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి అంకితమిస్తున్న యీ సంకలనాన్ని వెలువరించడంలో సహకరించిన మిత్రులందరికీ మరొకసారి కృతజ్ఞతలతో.........

4-8-1991.

డా॥ నాగినేని భాస్కరరావు
M.B,B.S.

మధిర - 507203
ఖమ్మం జిల్లా (ఆం.ప్ర.)

---



"చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది"

# అనుక్రమణిక...

# వ్యవస్థా వంచితులకు ప్రాణవాయువు "ఆక్సిజన్"

— ప్రొఫెసర్ చేకూరి రామారావు,
ప్రొఫెసర్ ఆఫ్ లింగ్విస్టిక్స్ & డీన్ ఫాకల్టీ ఆఫ్ ఆర్ట్స్
ఉస్మానియా యూనివర్శిటీ, హైదరాబాదు – 500 007.

మహా పురుషుల చరిత్ర ఒకజాతి చరిత్ర కానట్టుగానే మహాకవుల చరిత్ర సాహిత్య చరిత్ర కాదు. ఇట్లా అనటంవల్ల మహాపురుషులను కించపరచటం గాని, మహాకవులపాత్రను తక్కువ జేయటంగాని నా ఉద్దేశం కాదు. నా మట్టుకు నాకు మహాపురుషుల సంగతేమోగాని మహాకవులు ఇష్టమే. వాళ్ళ కవిత్వమూ ఇష్టమే. కాని ఒకజాతి చరిత్రలో మహాకవుల చరిత్ర మాత్రమే ఉంటే అది మహాకవుల చరిత్ర అవుతుంది కాని సాహిత్య చరిత్రకాదు. సాహిత్య చరిత్ర అంటే మహాకవులూ, ఒక మాదిరి కవులూ, అల్పకవులూ వాటి కవిత్వానికి స్పందించే పాఠక శ్రోతలు కలిసి నిర్మించేది. ఇది ప్రయత్న పూర్వకం కావచ్చు, కాకపోవచ్చు.

కవిత్వంలో తరతమ భేదాలెంచటానికిగాని, కవిత్వాన్ని అకవిత్వంనుంచి వేరుచేయటానికిగాని తగిన సాధనాలులేవని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదనుకుంటాను. కవిత్వాన్ని తూచేరాళ్ళు తన దగ్గరలేవన్నాడు చలం, శ్రీశ్రీ గారికి యోగ్యతాపత్రం ఇస్తూ. నిజానికి ఎవరిదగ్గరాలేవు. ఉన్నాయని ఎవరన్నా అంటే అది ఒట్టి బుకాయింపు మాత్రమే

కాని యుగయుగాలనుంచి కవిత్వాన్ని అంచనా కడుతూనే వున్నారు. ఫలానివాణ్ణి మహాకవి అని, మరో ఫలానివాణ్ణి ఒకమాదిరి కవి అని, మరో ఫలానివాణ్ణి అకవి అని అంటూనే వున్నారు. ఇది ఎట్లా జరుగుతున్నది?

ఒక కాలపు సమాజంలో అభిరుచుల సామ్యం ఉంటుంది. కళల విషయంలో కొంతవరకు 'కన్వెన్షన్' సాధ్యమవుతుంది. నన్నయనీ, తిక్కననీ, పోతననీ, కృష్ణశాస్త్రినీ, శ్రీశ్రీని కవులుకాదని ఎవరూ అనలేదు. పేర్లు చెప్పలేం కాని ఈనాడు కవులుగా పేరుతెచ్చుకున్న కొందరిని కవులుగా సాహిత్యకులు చాలామంది ఒప్పుకోరు. అట్లాంటివారు ప్రభుత్వం వారి చిట్టాలలోను, రేడియో, దూరదర్శన్ వారి లిస్టుల్లోనూ దొరుకుతారు.

కవులకూ, అకవులకూ మధ్య భేదం అంచుల్లా కనబడదు. అంటే కవిత్వాన్ని అకవిత్వంనుంచి వేరుచెయ్యలేమని.

ఏ కాలంలో అయినా సాహిత్య వాతావరణం అని ఒకటి ఉంటుంది. అందులో మహాకవులనుంచి అల్పకవుల వరకూ భాగస్వాములవుతారు. అందులో విమర్శకులకూ, పాఠకులకూ తప్పనిసరి పాత్ర ఉంటుంది. ఆ సాహిత్య వాతావరణానికి దోహదకారులయిన వారందరినీ కొంతకాలమయినా గుర్తించకుండా ఉండలేం.

సాహిత్యచరిత్రలో ఇంకోతమాషా ఏమిటంటే సమకాలికులు మెచ్చిన ఒక కవి తరువాత సోదిలో లేకుండా పోవచ్చు. సమకాలంలో గణనకెక్కనివారు పరిస్థితులనుకూలిస్తే మహాకవులు కావచ్చు. సాహిత్యచరిత్రలో (సమాజ చరిత్రలోలాగానే) అన్నీ సాధ్యమే.

ఈ నేపథ్యంలో నాగినేని భాస్కరరావు "ఆక్సిజన్"ని పరిశీలిద్దాం. భాస్కరరావు యుగకర్తకాదు. మహాకవికాదు. ఒక శకాన్నో, మార్గాన్నో, పలుకుబడినో స్థాపించిన వాడుకాదు. కాని కవి. సమకాలపు సమాజంలో వివిధ విషయాలకు స్పందించి పాఠకులకు ఏదో సందేశాన్ని అందించాలని తపన పడే కవి.

సుమారు ఒక అయిదేళ్ళ నుంచీ తెలుగు కవిత్వం యమపరుగులు తీస్తున్నది. ఒకనాటి పెద్ద కవులనుకూడా వెనక్కునెట్టేసి ముందుకు పోతున్నది. వస్తువిస్తృతిలోనూ, భావగాఢత్వంలోనూ చాలా ఎత్తుకు ఎదిగింది. తెలుగు కవిత్వం. చాలా సాంద్రతను కూడా సంతరించుకున్నది. ఒక పాతికేళ్ళ కిందటి మహాకవి ఇప్పటి కవిత్వం ముందు పాలిపోయినట్టు కనిపిస్తున్నాడు. భాస్కరరావు కాస్త ఆలస్యంగా పుట్టి ఉంటే ఇప్పటి సాంద్రకవుల సరసన చేరగలిగి ఉండే వాడేమో!

భాస్కరరావు ఏమన్నా అనుకోనీ ఒకటి చెప్పక తప్పదు. అతని దురదృష్టం అతని కాలం (His Time) అనుకుంటాను. అతడు యువ భారతీయకవిగా అవతరించాడు. సరిగ్గా తారీకులు తెలీవుకాని యువభారతి సంస్థ 1965–80 మధ్య కాలంలో బాగా ప్రసిద్ధిలో ఉంది. తెలుగు ప్రజల్లో సాహిత్య చైతన్యం కలిగించటానికి ప్రయత్నించింది. ముఖ్యంగా ప్రాచీన సాహిత్యాన్ని ప్రజల దగ్గరకు తీసుకెళ్ళే ప్రయత్నంలో విజయం సాధించింది. అయితే ఆ సంస్థకొందరు కవులనుకూడా ప్రోత్సహించింది. కాని కవులకు అవసరమైన inspiration యివ్వలేకపోయింది. సరిగ్గా ఆ సమయంలోనే కొంతముందుగా దిగంబర కవిత్వం తెలుగు కవిత్వాన్ని ఒక కుదుపు కుదిపింది. ఆ తరువాత వచ్చిన విప్లవ కవిత్వం తెలుగు కవిత్వానికి పథనిర్దేశం చేసింది. ఆ సమయంలో యువభారతి కమిట్మెంటుతో సంబంధంలేని అస్పష్ట అభ్యుదయాభాస కవితా ధోరణులను ఆదరించి ప్రోత్సహించింది. నాగినేని

భాస్కరరావు ఆవరసలోనే కవిగా అవతరించాడు. అందువల్ల యువభారతి వారి కవులు యువభారతీయులుగానే మిగిలిపోయారు. తెలుగు కవిత్వాన్ని ఏ విధంగానూ ప్రభావితం చెయ్యలేకపోయారు. యువభారతినుంచి బయటపడ్డ ఏ జయప్రభలాంటి వాళ్ళో చీల్చుకుని కవులుగా పునర్జన్మించారు. మిగతావాళ్ళు అక్కడే ఆగిపోయారు. నాగినేని భాస్కరరావు నాకు యువభారతికి ఒక సమగ్ర ప్రాతినిధ్యం వహించగల కవిగా కనిపిస్తాడు, ఇది ప్రశంసాకాదు; అభిశంసాకాదు. వాస్తవ పరిస్థితిని ప్రదర్శించటానికి చేసిన చిన్న ప్రయత్నం.

భాస్కరరావు వృత్తిరీత్యా డాక్టరు. అందులోను ప్రాక్టీసు బాగా ఉన్న డాక్టరు. అల్పమైన వినోదాలకే వ్యవధి చిక్కదు. అటువంటిది కవిత్వం చదవటానికీ, సాహితీ మిత్రులతో గోష్ఠులకు కాలం సరిపోదు. మధిరలో ఏమంత సాహిత్య వాతావరణం లేదు కూడా. అయినా కవితారచనపై మక్కువ వదలని భాస్కరరావు ఉన్న వ్యవధిలోనే అవకాశాన్ని చిక్కించుకొని కవితా రచన చెయ్యటం మెచ్చుకోదగిన గుణం. ఈయన రచనలు ఎక్కువగా ప్రజాశక్తి ఆదివారం అనుబంధంలో ప్రచురితమయ్యాయి. మరికొన్ని అధ్యయన వేదిక ప్రత్యేక సంచికలోను, ఒకటీఅరా భారతిలోను అచ్చయ్యాయి.

ఈ వ్యవస్థలో వున్న లోపాలను బహిర్గతంచేసి ప్రజలకు కనువిప్పు కలిగించటమే ఈ కవి కవితా లక్ష్యం. శ్రామికులపై ప్రేమ ఉంది. స్త్రీ సమస్యలపై సమ్యగవగాహన ఉంది. ఈ వ్యవస్థ ఇంత అన్యాయంగా ఉండటానికి పాలకుల పాత్ర ప్రధాన కారణమని గుర్తించాడు. తిరుగుబాటును, విప్లవాన్ని ప్రేరేపించే ధోరణి ఏదీలేదు. కాని ఎర్రజెండాపై, సామ్యవాదంపై ప్రేమ ప్రకటిస్తాడు. వీరపూజ కూడా కనిపిస్తుంది. "వీరతెలంగాణా పోరాటం నడిపి, నైజాం నడుము విరిచి రైతులకు భూముల నందించినవాడా!" అని సుందరయ్యగారిని కీర్తించాడు.

భాస్కరరావు కవిత్వం పారదర్శకమైనది. ఆయన చెప్పేది అర్థం చేసుకోటానికి మనకు అడ్డంవచ్చే సామగ్రి ఆయన కవిత్వంలో ఉండదు. ఆక్సిజన్‌లా కంటికి కనిపించకుండా ఆరోగ్యాన్ని అందించగల లక్షణం ఈ కవిత్వానికి ఉంది.

భాష విషయంలో ఈయన నాకంటే స్వతంత్రుడులాగున్నాడు. ఏ సంకోచం లేకుండా హలరేడు, గెలుపుకారుడు, జనచీమలు, జలపంపిణీ, నవీన దొంగలు వంటి సమాసాలను సృజించి ధైర్యంగా వాడతాడు. "మతమోద్విత" అనే సమాసంలో మోదు అనే తెలుగు ధాతువును సంస్కృత 'సేట్' ధాతువుతో సమానంచేసి సంస్కృత "త" ప్రత్యయాన్ని చేర్చటానికి చాలా సృజనశక్తి, ధైర్యమూ కావాలి.

ప్రస్తుత వ్యవస్థలో లోపాల్ని పాఠకులకు వివరించటంలో భాస్కరరావు తన పాత్రను సమర్థంగా నిర్వహించగలడనే నమ్ముతాను.

చేరా

## "తెలుగు దున్నపోతు"

వర్షాభావంతో
అసంపూర్ణ జలపంపిణీలో
అయోమయ విద్యుత్ సరఫరాతో -
అందిన చాలీచాలని పంటతో
ప్రభుత్వ ఋణ ప్రణాలతో
వణుకుతూ నీరసించిన
జీర్ణ వస్త్రధారి - కృషీవలుడు.
రక్షిత మంచినీటి కొరతతో
ఆసాంతం కమ్మిన దోపిడీ చీకటిలో
చాలని వసతితో నిండని కడుపుతో
కలుషిత వాతావరణంలో - వ్యవసాయకూలీ
మురికి వాడలో
ఇరుకు గదిలో - క్రుంగే శరీరంతో
బొటాబొటీ భత్యంతో
రోగాల్లో రొచ్చుల్లో
అతి తక్కువ ధరకు శ్రమను అమ్ముకొని
పరిశ్రమలనిల్పే - శ్రామికుడు.
అన్నిట్లో ముందుంటామంటూ
వాస్తవంలో
అన్నింట్లోను వంచించబడి, హింసించబడి
దారుణ దయనీయ స్థితిలో
"మార్కెట్" వస్తువుగా
మార్చబడ్డ - మానవి.
మొగ్గదశలోనే చెట్టు తత్వాన్ని కొనితెచ్చుకొని

మగతనాన్ని వదలి మగతను జీర్ణించుకొని
ఎటూకాని అవ్యవస్థలో - యువత.
మంత్రి మారినప్పుడల్లా మారే
విద్యావిధానంలో -
మేధను అమేధం శాసించే
వ్యవస్థలో - విద్యార్థి.
రివిజనిజం రాపిడికి
నాయకత్వ దోపిడికి
తట్టుకొని
చివరకు - ఒంటరిగా
ఒంటెత్తు పోకడగా
ఓటు కాదు తూటా నా మార్గమని
గొంతెత్తిన - వర్గ పోరాటకారుడు.
వీరితో మరికొందరూ -
మార్పు కోరుకున్న కాలంలో -
అనుకూల కాలం గాలాన్ని చేపట్టి
ప్రజాజీవన సముద్రంలో
వాగ్దానాల నావను మరమ్మత్తు చేసుకొని
పదవుల చేపల్ని వేటాడ్తూ
తన హావభావములచేత
పదవుల చేజిక్కించుకొని
నాయకుడు - మార్గం మార్చి -
పరిపాలన రోడ్డుమీద
ప్రజా సౌకర్యముల శకటమును పూన్చి
తోల నారంభించెను.
శకటము కదలదు.

శకట సారథులు - సెక్రటరీలు (Secretaries)
శ్రమించిరి, స్వేదమును స్రవించిరి -
అప్పుడు తెలుసుకొనిరి -
నాయకుని పదకొండవ అవతారమే
శకటమును లాగుచున్నదని
పాపం దానికి
పత్రికా సంచికలను నమలటమే కాని
చదువుట తెలియ నేర్వదని
అదియొక - తెలుగు దున్నపోతని.

రచనా కాలం : 7-5-1988
(భారతి, సాహిత్య మాసపత్రిక, మార్చి 1990 లో ప్రచురితం)

# "బాధ్యత"

జన చీమలు పోగుపెట్టిన
సంపద పుట్టల నెలవయ్యే
రాజకీయ పాముల నుండి
పౌరుడా! రక్షించు దేశాన్ని!!

కొడిగట్టిన విలువల్ని సైతం
నేలమట్టం చేసే
కుహనా సంస్కృతికారులనుండి
పౌరుడా! రక్షించు దేశాన్ని!!

క్షణకాల ఆశల్ని చూపి
చిరకాల ఆస్తుల్ని, హక్కుల్ని
ఎన్నికల మాయలో కాజేసే నవీన దొంగల బారినుండి
పౌరుడా! రక్షించు దేశాన్ని!!

తన భద్రతకై - జాతి సమగ్రతనూ
తన అధికారంకై - జాతీయతనూ
తన లాలసతకై - సంఘ కట్టుబాట్లనూ
విస్మరించి సంచరించే తులువల నుండి
పౌరుడా! రక్షించు దేశాన్ని!!

అతివను అందమైన వస్తువుగా మార్చి
ప్రకృతసిద్ధమైన శారీరక వ్యత్యాసాలపేర
సాంఘిక, ఆర్థిక, లైంగిక భేదాలు చూపి
తెలివిగా వ్యాపారించు కాపురుషుల నుండి
పౌరుడా! రక్షించు దేశాన్ని!!

యువతీ యువకుల్ని
అజ్ఞానం నుండి నిరుద్యోగం నుండి
"మాదకద్రవ్యాల" కోరలనుండి
సోమరుల గోమారుల నుండి
కుహనాభక్తుల నుండి - నటనా విరక్తుల నుండి
పౌరుడా! రక్షించు దేశాన్ని!!

అతివాదులనుండీ, అసామ్యవాదుల నుండీ
రాళ్లైపోయిన అనంతకోటి దేవుళ్ళ నుండీ
పౌరుడా! రక్షించుదేశాన్ని!!

రచనా కాలం : 5-9-'88
(అధ్యయన వేదిక, ప్రత్యేక సంచిక, 1989లో ప్రచురితం)

# "సమగ్రత"

"ఖలిస్తాన్ ! ఖలిస్తాన్ !! ఖలిస్తాన్ !!!"
"గూర్ఖాలాండ్ ! గూర్ఖాలాండ్ !"
"తమిళ్ నాడు ! తమిళ్ నాడు !!"
"తెలుగు భాష ! తెలుగుభాష !!"
"కన్నడనాడు ! కన్నడనాడు !!"
"కాశ్మీరు ! కాశ్మీరు !!"
"గంగకు దూపండీ తెలుగ్గంగ"
"దొంగకు కాపండీ గజదొంగ"
"కిలాడీలపై అజమాయిషీ జగత్ కిలాటీకి"
ఏవేవో కేకలు
ఏమేమో అరుపులు
ఎన్నెన్నో కంఠాలు
ఎక్కడెక్కడో తొండ చరుపులు
ఎందెందు వెదకినా
అందనిదే సమగ్రత.
"ప్రజాస్వామ్యం ! ప్రజాక్షేమం !!"
"ప్రజాభ్యుదయం ! ప్రజల సుఖం"
కేకలా అవి – కాదు, రాజకీయ కాకుల అరుపులు
అరుపులా అవి – కాదు, రాజకీయ గాడ్దెల ఓండ్రింపులు
అంతలో
ధనేల్ మన్న శబ్దం
అప్పుడు వచ్చింది నాకు మెలకువ
దేశం మంచం నుండి

వాస్తవతా నేలమీద నేను —
రోజు రోజుకు రాజుకుంటున్న
ప్రాంతీయ తత్వాల —
దినదినం దండుకుంటున్న
మతకలహాల —
నిత్యం నింగి కెగురుతున్న
కులరాజకీయాల —
మడతలతో
తలపాగా చుట్టుకొని స్వార్థశక్తుల ముట్టడి
నట్టనడుమ నేను.
నిరుద్యోగుల నిట్టూర్పుల మధ్య
నిద్రాణమైన నా మస్తిష్కం
మేల్కొనగ —
ఎందెందు వెదకిన
అందనిదే సమగ్రత.
హరిదాసుని కథవలె నాయకుని సొద
ఆచరణలేని అద్భుత ప్రణాళికలు
గారడీవానివలె నాయకుని గతి
ఆర్థిక వనరులు లేని పథకాల స్థితి
ఇంద్రజాలమువలె నాయకుని ప్రకటనలు
కాగితాల మీదనే ప్రజలకు ప్రగతి
అలా —
వికటించిన ప్రజాస్వామ్యం
ప్రకటించిన - దగాకోరు ప్రభుత్వంలో
ఎటు చూస్తే అటు - వేర్పాటు యుద్ధాలు
ఎటు పిలిస్తే అటు - అసమర్థతా అభ్యర్థనలు

వికటించిన ప్రజాస్వామ్యం
ప్రకటించిన - నపుంసక పాలనలో
ఎటు చూస్తే అటు - అవినీతి నృత్యాలు
ఎటు పిలిస్తే అటు - స్వార్థం రాగాలు
వికటించిన ప్రజాస్వామ్యం
ప్రకటించిన - సన్యాసి పాలనలో
ఎటుచూస్తే అటు - కడు దురాశ
వికటించిన ప్రజాస్వామ్యం
ప్రకటించిన - పెట్టుబడిదారీ పాలనలో
ఎటుచూస్తే అటు - స్త్రీలపై అత్యాచారాలు
ఎటు పిలిస్తే అటు - ఆటబొమ్మగా ఆడది
— నా మేల్కొన్న మెదడు
ఎందెందు వెదకినా
అందనిదే సమగ్రత.
చదువున్న పెద్దలారా!
చదువుతున్న చిన్నలారా!
పనిచేసే మెదడున్న నవయువతా!
అనుభవాల శక్తులతో నడుస్తున్న నిస్వార్థ నేతలారా!
మన దేశంలో - వికటించిన ప్రజాస్వామ్యానికి
విరుగుడు-సోషలిజం, శ్రామిక నియంతృత్వం ఆయుధంగా-
భాష, ప్రాంతం, మతం, కులం అడ్డుగోడలనిన్నింటినీ పడగొట్టిన
మరుక్షణం
ఎందెందు వెదకినా
అందందే సమగ్రత.

రచనా కాలం : 28-7-'86

(అధ్యయన వేదిక, ప్రత్యేక సంచిక, 1987 లో ప్రచురితం)

# "మార్గాన..."

నవయవ్వన సత్తువతో ఉద్రేకం పూపులలో
ఉత్సాహం రెక్కలార్చి, ఆశయాల కేకలేస్తూ
ఎగిరాను శూరుడనై - ఆత్రంగా, ఆవేశంగా
అందాలని నాగమ్యం సూర్యుణ్ణి
అంతే - తెలివొచ్చేసరికి
రెక్కలు తెగి నెత్తురోడుతున్నాను.
కన్నుమూస్తూ చూసాను -
నా నెత్తురు చప్పరిస్తూ
వికటంగా నవ్వుతున్న, వికలంగా తుళ్ళుతున్న
విద్రోహం విచ్చుకత్తులు
జీవిత విహాయసాన
కంటకాల కారుమేఘాల్లో
కోర్కెల తెలిమబ్బుల మధ్య
సమస్యల సుడిగాలిలో
సహస్ర సహస్ర ఆశా ప్రభాప్రసారుడు
నా గమ్యం సూర్యుడు.

రచనా కాలం : జనవరి, 1976
(నందిని, యువభారతి సాహిత్య మాస పత్రికలో ప్రచురితం)

# "హలరేడు"

వ్యథలను విస్మరించి
వసుధను నమ్మి
ఆహార సుధలను పండించడానికి
బీడుల్ని బాగుచేద్దామని
హలం పట్టి
పొలం నాలుగు మూలల్నీ
కలియ దున్ని, సరిచేసి—
నీటికై
నీలాకాశంకేసి
చూపుల్ని సారించి
నిరంతరం నిరీక్షించి
అతిగానో అల్పంగానో కురిసే
మేఘాల్ని నమ్ముకుని మోసపోయి
ఫలించని శక్తులూ
చలించని ఏలికలూ
కల్పించిన క్షామం
విసిరే స్త్రే—
పీకని వాడు
ఆకలిమంటల నార్పి
తొలగిస్తాడు - ప్రజలపై దోపిడీ ముసుగును
నేడు
భూమి పోరులో

ఎర్రజెండా చేతపట్టి
త్రిగుణీ*కృత ఉత్సాహంతో
నిల్చే విజయుడు
గెలుపుకారుడు - హాలరేడు !

---

* సంఘటితం, సామ్యవాదం, చైతన్యం.

రచనా కాలం : 8-9-1988

(ప్రజాశక్తి దినపత్రిక, 27-11-1988 ఆదివారం అనుబంధంలో ప్రచురితం)

# "ఆక్సిజన్" [OXYGEN]

నావి సొగసైన కళ్ళు అంటారు
ఆ కళ్ళ చూపుల్లో పడితే—
తప్పించుకుపోవటం అసాధ్యమని ఒప్పుకుంటారు.
నాది కోటేరులాంటి ముక్కు అంటారు
ఆ నాసిక తన ధర్మం చేస్తే—
ధారికిపోవటం ఖాయం అంటారు.
నాది అందమైన నోరు అంటారు
ఆ నోరు విప్పి మాట్లాడితే—
అయస్కాంతానికి ఇనుపరజనులా ఆకర్షింపబడటం
ఆ ఆకర్షణలో అన్నీ మరువటం సహజం అంటారు.
నా నుదురు విశాలమంటారు
ఆ నొసలు చిట్లిస్తే—
ప్రజల్ని భక్షించే నోళ్ళు మూతపడతాయంటారు.
నా చెవులు సుందరం అంటారు
ఆ చెవులు పనిచేస్తే—
శూన్యాశూన్యాల శబ్ద విశ్లేషణ చేసి
శబ్ద నియంత్రణ సూచనలిస్తా యంటారు.
నా కంఠ ధ్వని
కంచుమోతకు పోలిన దంటారు
ఆ కంఠం నుండి వచ్చే మాటలు, పాటలు, ప్రసంగాలు
శత్రువునుసైతం చొచ్చరగొడ్తాయనీ—
భీరువునుసైతం ధీరువుగా మారుస్తాయనీ—
మేరువునుసైతం ప్రమోల నిల్పుకుంటాయనీ అంటారు.
నావి ఆజాను బాహువులట

ఆ బాహువుల పనితీరు
జ్యేష్ఠాదేవిని దగ్గరకు రానివ్వదంటారు.
నా ఛాతీ, నడుము
సింహాన్ని మరిపిస్తాయంటారు.
నా కాళ్ళు పొడవైనవీ, దృఢమైనవి అంటారు
ఆ కాళ్ళు నడిస్తే__
కడుపహారాలు కనురెప్పపాటులో తరుగుతాయనీ__
చెడుద్వారాలు చేరువకు ముందే మూసుకుపోతాయనీ__
కాడురమ్మనే వయసులోనూ పటిమను చూపుతాయనీ అంటారు
నేను, నా శరీరం__
నేను, నా వర్చస్సు__
నేను, నా మనస్సు__
నేను, నా నడనడిక__
అన్నీ - విశ్వమానవజాతి సౌఖ్యానికే
విశ్వ, విశ్వాంతరాళ శాంతికే.
కాని__
నాడు అదొక భ్రాంతి
నేడు నేనొక "మ్యూజియం" వస్తువును
నేడు నేనొక "సమాజ అరుచి"ని.
నా తీక్షణమైన నయనాల ముందు
వికృత లోమనసుల విస్తృత నగ్న నృత్యాలు.
నా సహజ సుందర నాసికా రంధ్రాల చుట్టూ__
వికారమైన వివిధ కాలుష్యాల దట్టమైన పొగ.
నా అందమైన నోటిపై__
జుగుప్సాకర పెట్టుబడిశక్తి సుందరి గాఢ చుంబనం.
నా విశాలమైన నుదుటిపై

మత మోదిత సంస్కృతి ఛాయలు.
నా శ్రవణేంద్రియాల ప్రక్క—
స్వార్థలలామ లాలిత్యపు పలుకులు
లాలసతా స్వైరవిహారిణీ మణుల గుసగుసలు.
నా కంచు కంఠం ధ్వనులు
అలసత్వ రాక్షస కేరింతల మధ్య—
విద్రోహమూకల అట్టహాసాల మధ్య
మత్తు, సొత్తుల్లో మతిచెడ్డ యువత గొడవ మధ్య—
వేదాలు వల్లించే ఫ్యూడల్ దెయ్యాలమధ్య—
నిరక్షరాస్యతా ఎడారిలో చిక్కుకొని,
అనుభవాల ఒంటెలపై—
మంచి జీవితపు ఒయాసిస్సులు దొరక్క
దారిద్ర్యం తోడుగా, అజ్ఞానం కత్తితో
ఒంటెల పొట్టల్ని చీల్చుద్దామనుకుంటున్న
ప్రజకు వినిపించటంలేదు
నా కంచుకంఠ ధ్వనులు వినిపించటంలేదు.
నా ఆజానుబాహువులకు
సోమరి, పోకిల్లాల స్వర్ణశృంఖలాలు
స్వేచ్ఛపేరున అబాధ్యతా హారాలు.
సింహాన్ని మరపించే
నా ఛాతీపై అప్పుల బరువులు
నా నడుముకు అంతఃశత్రు శరాలు.
నా కాళ్ళకు—
లేమి ముళ్ళ తీగల బంధాలు
అభద్రతా లోహ బంధనాలు.
నేను - నేనేనా అని నన్ను నేను ప్రశ్నించుకుంటే—

నాకు సమాధానం దొరకలేదు
ఏ అజ్ఞాతవీరుడో జ్ఞాపకంరావటం తప్ప.
నా ఉనికిని చెప్పగల ద్రష్ట
నా ఉనికిని వన్నెపెట్టగల స్రష్ట
ఈ దేశంలో - ప్రజల్లో
నన్ను ప్రతిష్ఠించగల మహామనీషి కావాలి
సత్యం, ధర్మం, త్రిభుజంలో
కావాలి నేనూ ఒక భుజాన్ని
సార్థకపర్చాలి "క్రమశిక్షణ" అన్న నా నామధేయాన్ని.

రచనా కాలం : 5-4-1989

# "అవతలి గట్టుకు"

తెలివిగలవాళ్ళమనుకుంటూ మీరు
లాభనష్టాల బేరీజు వేసాక
మాకు దగ్గరౌతారు
మా వెంట వుంటారు
మా మంచితనం మీకు వరం
అందులో మీపరం అవుతాయి లాభాలు.
అప్పుడు
మా మాటలు మీకు ప్రియం!
మా చేతలు మీకు మార్గం!!
మన నిత్యజీవన సమరంలో
నేటి పితృస్వామ్య, బూర్జువా పెట్టుబడిదారీ వ్యవస్థలో
పరస్పర శాంతి, సహజీవనం, మానవత కరువై
మార్గంతో నిమిత్తం లేకుండా
ధనార్జనే విలువలకు గీటురాయిగా -
వున్న అసామ్యసంఘాన్ని -
వ్యతిరేకించి జరిపే పోరాటం మాది.
సామ్యవాదం ఆయుధంగా
సమసమాజంకోసం ఆగని మా పోరాటాన్ని
పీడిత తాడిత జనసందోహంతో వున్న మమ్మల్ని
గమనించీ - గమనించనట్లు
తెలివిగలవాళ్ళ మనుకుంటారు మీరు
లాభనష్టాల బేరీజు వేసాక
మాకు దగ్గరౌతారు
మా వెంట వుంటారు

మాతో నడుస్తామంటారు
భ్రష్టుపట్టిన పాతను పొడుస్తామంటారు
మమ్మల్ని నమ్మమంటారు, నమ్మింపజూస్తారు.
అవసరం తీరాక -
తెలివిగలవాళ్ళు మనుకుంటూ మీరు
తప్పుకుంటారు మానుంచి -
కష్టనష్టాలు మానెత్తినుంచి
తప్పదంటారు, తప్పు లేదంటారు.
తుప్పు రాలిందని తల్చుకోమంటారు
వరమైన మా మంచితనం, నిగ్రహం
తీవ్రశరాఘాతం మీ మెదళ్ళందు
మా ప్రభావం అకుంఠితం
మా పోరాటంలో లేవు మినహాయింపులు
అతి తెలివికి, వెన్నుపోట్లకు తప్పవు కత్తిరింపులు.
ఈ దుష్ట సమాజ హరణంలో
అవుతారు మీరు భాగస్వాములు - నేడో - రేపో
తెలివిగలవాళ్ళమనుకుంటూ మీరు
ఆ తెలివికే విచక్షతను బాధ్యతను నేర్పుతూ - మేం.

రచనా కాలం : మార్చి, 1987
అధ్యయన వేదిక, ప్రత్యేక సంచిక, 1987 లో ప్రచురితం.

# అక్టోబర్ 2

## ("GOD SAYS GONE" THE MAHATMA)

ఈ దినం సిగ్గుపడాల్సిన దినం
ఈ దినం నిగ్గు తేల్చాలి మనం
ఈ దినం వెనక్కి తగ్గి తర్కించుకోవాల్సిన దినం
ఈ దినం 'పెగ్గు'ను పారదోలాల్సిన దినం
పత్రికల్లో ప్రకటనలిస్తోంది
ఉపన్యాసాల్లో పదేపదే వక్కాణిస్తోంది
పాలిస్తే మేం బలపడతాం
చాలిస్తే మేం బతకలేం—
నేను లేనప్పుడు

ఈ రైళ్ళున్నాయా?
ఈ ప్రాజెక్టులున్నాయా?
ఈ 'ఆర్యభటు'లు 'రోహిణీ'లున్నాయా? అంటూ

దేశాన్ని అప్పుల్లో
ప్రజల్ని దరిద్రంలో
యువతను అవ్యవస్థలో
కార్మిక శక్తిని దోపిడీచేసి
సామాన్య ప్రజలను మాటల గారడీలో ముంచి
అసమర్థ పాలకులై
అహింసా వాదనలో హింసే క్రియగా
శాంతి బోధనలో అశాంతిని రేపుతూ
గాంధీ శిష్యులమంటూ బ్రాందీ సేవకులై
తనకొక ధర్మం - ప్రజలకొక ధర్మం

పాటిస్తున్న ప్రభుత్వం-
తలలు దించి - కండ్లుమూసి -
'ఒక్క నిముషమైనా' - తన వంచన బ్రతుకుకు
సిగ్గుపడాల్సిన దినం
"గాంధీ" అంటూ దండలువేసే చేతులు
సిగ్గుపడాల్సిన దినం
బ్రిటీష్ పాలకుల్ని దేశం నుండి గెంటి -
స్వాతంత్ర్య సార్వభౌమత్వాన్ని సేకరించి
నాల్గు దశాబ్దాలు కావస్తున్నా-
'భారతి ముద్దు బిడ్డలు అన్ని రంగాల్లో
విదేశాల్లో పనిచేస్తూ -
ప్రపంచ ప్రఖ్యాతి నార్జిస్తుంటే -
'భరత ఖండం' రత్నగర్భ అని
'భరతభూమి' పుణ్యభూమి అని
జబ్బలు చరుస్తూ -
పెట్టుబడిదారీ వ్యవస్థలోని
చిక్కుముడుల్ని తప్పించక
తాను మాత్రం తృప్తి పడుతూ -
సామాన్య జనాన్ని - తిడుతూన్న
'మేధావి' వర్గం -
తన కర్తవ్యాన్ని స్మరించి
గాంధీవలె మరొక త్యాగి
లాల్‌బహదూర్ వలె -
నివురుగప్పిన తన శక్తికి
నిగ్గుదేల్చవలసిన దినం
కులతత్వాన్ని, మతతత్వాన్ని

'పుచ్చిన ప్రభుత'కు మల్లె
అనుకరిస్తూ
అనైక్యతా విహాయసంలో
రెక్కలాడిస్తూ
రొప్పుతున్న ప్రతిపక్ష నాయకులు
వెనక్కు తగ్గి - పునరాలోచించి
పునరేకీకరణం కావాల్సిన దినం
ఎవరు చెప్పినా గొర్రెవలె తలాడిస్తూ -
ఎవరు చెప్పినా గుడ్డిగా నమ్మేస్తూ
దారిద్ర్యం ఇంట్లో నివసిస్తూ
శ్రమశక్తిని గుర్తించక -
'శ్రామిక వర్గాన్ని' అర్థం చేసుకోక
శ్రమ విలువ తెలియక -
సామాన్య జనం - అసంఖ్యాకంగా
సామాన్య జనం - అనాలోచితంగా
సామాన్య జనం - అసలు సమయంలో
ఆనందం కావాలని 'అమృతం' అనుకొని
సురాపానం చేస్తూ
"స్పృహ" కోల్పోతున్న సమయంలో
వాళ్ళంతా—
ముప్పయ్‌నాలుగు నుండి నలభై ఎనిమిదో శాతానికి పెరిగిన
శారీరక, మానసిక, సాంఘిక దరిద్రులంతా-
వాళ్ళతో పాటు 'అలవాటున్న' మనమంతా
'పెగ్గు'ను పారదోలాల్సిన దినం
ఈ దినం 'రామరాజ్యం' కావాలనుకున్న -
మానవతావాది గాంధీజీ జన్మదినం

ఈ దినం - ఇప్పుడు 'రావణబ్రహ్మ' రాజ్యంలో
రాముడి తప్పుల్ని లెక్కిస్తూ -
కుల రక్కసుల్ని తప్పించుకుంటూ
ఆకలి చావులూ, రోగం అరుపులూ
దాయాది హత్యలూ, స్త్రీల మానభంగాలూ
కల్తీ సరుకులూ, అవినీతి రాజకీయాలూ
కనిపించని, వినిపించని
'శ్రామిక రాజ్యం' కోసం
శ్రమిస్తామని
స్రవిస్తామని
శపథం చేస్తే
మానవతావాది గాంధీజీ
ఈ దినం ధన్యుడౌతాడు

రచనా కాలం : 2_10_1983
'ఐక్య ఉపాధ్యాయ' అక్టోబర్ 1988 సంచికలో ప్రచురితం

# మా యిల్లు

మా యింటిపేరు రత్నగర్భ
గంపెడు పిల్లల్ని కని వెళ్ళిపోయిన నా తండ్రి
పేరు చెప్పుకుంటూ - పిల్లలకు పెట్టుకుంటూన్న
మా 'అమ్మ'ను అన్నం అడిగితే -
నాకు మిాటింగులున్నాయి -
ఆకలి సర్వవ్యాప్తం ఓర్చుకోమంటుంది
ఇంట్లో నీళ్ళు కూడా లేవంటే
నాకు బయట పనంటూ రుద్రాక్షమాలను
సవరించుకుంటుంది
"మొన్న నా మాట విన్నావా?"
నీ 'అన్న'నే అడగమంటుంది
మరి అన్నేమో - అమ్మ మంచిది కాదంటాడు
'నాకు డబ్బివ్వలేమురా' అంటాడు
నా భావం వామపక్షం అంటాడు
కాషాయం కప్పుకొని హెలికాప్టరులో వెళ్ళిపోతాడు
నా తమ్ముళ్ళకు లేని జబ్బులు లేవు
మా ఆదిగురువు శంకరుడంటూ
అమ్మ అప్పుకోసం వెళ్తానంటుంది...
అన్నేమో భిక్షానికి వెళ్తానంటాడు...
మా పెద్దల నిర్వాకంలో
మా యిల్లొక త్రిశంకు స్వర్గం
మిారు చూస్తున్నారు కనుక
మేమంతా నవరస నటనాసార్వభౌములం
మరి వేస్తారా మిారంతా మాకు దండలు

రచనా కాలం : 8-5-1983

# కామ్రేడ్ సుందరయ్యా!

కమ్యూనిజం మార్గాన్ని నిర్మించి
కష్టజీవుల కందించిన వాడా!
వీర తెలంగాణా పోరాటం నడిపి
నైజాం నడుము విరిచి
రైతులకు భూముల నందించినవాడా!
మార్క్సిజం వెలుగుల్ని భారతదేశంలో
కావాల్సిన రీతిలో చిందించినవాడా!
క్లిష్టదశలో భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) సారథివై
క్లేశాల నధిగమించి పట్టుదలతో పరిశ్రమించి
ప్రపంచంలో నేడు నక్షత్రమైనవాడా!
నిఖిల ప్రపంచానికి నిస్వార్థానికి అర్థం చెప్పి
సకల జనావళికి క్రమశిక్షణ రూపం చూపినవాడా!
శ్రమైకజీవుల విముక్తికై
సమసమాజ స్థాపనలో జీవితాన్ని వెచ్చించి
పీడితజన ఆశాజ్యోతివై వెలిగి వెలిగి
వెలిగిపోయిన త్యాగధనుడా!
మా మనస్సుల్లో హృదయంలో
భావనలో నీ సిద్ధాంతం నీ ఆదర్శం స్థిరమై
కనులముందు నీ రూపం చెరగనివాడా!
ప్రియతమ కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యా!
నీకివే మా జోహార్లు!!

రచనా కాలం : **24-5-1985**
ప్రజాశక్తి దినపత్రిక **2-6-1985 నాటి**
ఆదివారం అనుబంధంలో **ప్రచురితం.**

# ఏకంకండి !

వీరుడవైనా వెనకనే ఉన్నావు
త్యాగధనుడవైనా తరిగిపోతూనే వున్నావు
ప్రత్యామ్నాయానివి నీవే అయినా -
ఫలితం కాలేకున్నావ్
దరిద్రంలో, ఆకలిలో, చావులో
దాస్యంలో బానిసలుగా -
అజ్ఞానంలో, అమాయకత్వంలో
నిస్సహాయతగా, దీనులుగా -
మాఢ్యంలో మతంలో
మధ్యతరగతి మనస్తత్వంలో
మనుషులమన్న సంగతి మర్చిపోయిన మేధావులుగా -
అడవిగాచిన వెన్నెల్లా ఉన్న
మీ ప్రయత్నాలన్నింటినీ
చూసి - చెందిన
నిరాశ -
కనపడలేదా ?
వినపడలేదా ?
వినపడినా, కనపడినా
భిన్నత్వంలో తాదాత్మ్యం చెందుతున్నారా ?
మనదేశ స్థితినిబట్టి -
మార్క్సిజాన్ని మల్చుకోవటం మరచి
ముక్కలు ముక్కలై మసలుతున్నారా ?
మాణిక్యాన్ని మట్టిలో కప్పుతున్నారా ?
దోపిడీ వర్గంపై సలిపే

పోరాటంలో భిన్నస్వరాలా ?
నిన్నటి భేదం మరచి
ఈ పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని కూలదోసి
ప్రజల రక్తం పీల్చే పాలక భోక్తల్ని ఎండగట్టి
శ్రామికజన ఆశాజ్యోతిగా
వామపక్షాల ఐక్యతా గీతానికి
మీ మీ భిన్నస్వరాల్ని ఏకంచేసి
ఏకంకండి
సమిష్టిబలంతో ముందుకు దూసుకుపోండి.

రచనా కాలం : 26-1-1983.

# వయస్సు ఎంత ?

నా వయసు 42
నా శరీరం అలా కాదంటుంది
నెత్తిమీద తెల్లదనం -
కనిపించే బడలిక
చెప్పేస్తాయి నాకు 64 అని.
తాతలనాటి పేరుమీద
నేతలుగా వుంటూ నా
ఈతిబాధల్ని పట్టించుకోక
జాతిపట్ల బాధ్యతల్ని మర్చిపోతే -
మారిన నా శరీరం
జారిన నా జవసత్వం
పేరిన నా నిస్సహాయత
కారిన నా కన్నీళ్ళు
చెప్పకనే చెప్పేస్తాయి నాకు 64 అని.
పేరు చెప్పకపోయినా
అన్యాపదేశంగా అరుస్తూ -
ముద్దు, మురిపం లేదంటూ,
చెప్తూనే వుంటుంది -
'అభివృద్ధి' అనే నా సహధర్మచారిణి
నాకు 64 అని.

o * *

నా వయసు 42
నా హృదయం కాదంటుందలా
18! 18!! 18!!! అంటుందన్ని వేళలా
వంటపట్టని నా చదువు,
ఇంట వుండని నా కాళ్ళు,
అయోమయం స్నేహాలు,
అర్థంలేని అర్థరాత్రి మేలుకోవటాలూ
అనారోగ్యమూ, అరకొరవైద్యం
అహోహాలు, అరచుకోవటాలూ,
స్వప్నాల్లో స్వర్గాలూ,
అప్పుడప్పుడు జల్సాలూ -
అప్పుల్లో కూరుకుపోవటాలూ
అయినా - చావని ఆశ
ఉత్సాహం! ఉద్వేగం!! ఉద్రేకం!!!
చెప్పకనే చెప్తాయి నాకు 18 అని.
ఫలించని ప్రేమా, పరుగెత్తిన కామం.
కకావికలైన మనస్సూ, కనుపించని మృగత్వం
అప్పుసటోయ్ నీకు 18 అని
చెప్పాయి
నా హృదయం వయస్సు 18 అని.

* * *

నా వయస్సు 42
నా మెదడు అంటున్నది 24 అని
జీవితమంతా బిడ్డలకోసం వెచ్చించి -
వృద్ధాప్య ప్రాప్తులైన తల్లిదండ్రులు,
వయస్సు జీవిత వసంతకాలాన్నిచ్చినా

దుష్ట కట్న కానుకల కబంధహస్తాల్ని
వదలించి, విదిలించి వైవాహికంలోకి రాలేని చెల్లెళ్ళు
నా స్తనంలో, స్వప్నంలో
భయంకరంగా భీతిగొల్పే నిరుద్యోగం,
ద్వంద్వ ప్రమాణాలతో -
దమననీతిలో -
దిక్కుతోచని నేటి నా స్థితి
ఎదుగుదల నిల్చిపోయిన నా స్థితి
చెప్పాయి నా వయస్సు 24 అని.
దస్తావేజులో వయస్సు పెరిగినా
దమ్మిడీ సంపాదించలేని నా స్థితికి -
పెరుగుతున్న నల్లబజారులో
బలిష్టమవుతున్న అరాచక రాజకీయంలో
విదేశీ గుత్తసంస్థల కబంధ వ్యూహంలో
సుళ్ళుతిరుగుతున్న సమస్యల సముద్రం -
నన్ను మూడువైపులా చుట్టుముట్టి -
పరిహసించగా
నా మెదడు చెప్పింది పదే పదే
నాకింకా వయస్సు 24 అని
నా వయస్సు 42! 64!! 18!!! 24!!!! ల్లో
ఏది? ఏది?
నే నుంటున్నది భారతదేశం!
నా పేరు స్వాతంత్ర్యం!!

రచనా కాలం : 15-8-1988

28-8-1988 ప్రజాశక్తి ఆదివారం అనుబంధంలో ప్రచురితం.

# వివాహం

సంఘానికి బిగించిన
ప్రపంచమనే కాన్వాసుమీద
వివిధావస్థల రంగు రంగుల
ప్రకృతి - (స్త్రీ)
ప్రకృతికి సార్థకతనిచ్చి జీవం నింపే -
పురుషుడు -
కలిసి వేసే చిత్రం జీవితం
దానికి చట్టం వివాహం

రచనా కాలం : 10_8_1986

# కామన

దేశవాసుల సంపూర్ణ
విద్యాగంధ పరిమళాల నాస్వాదిస్తూ-
స్వార్థ, కపట, నీచ నాయక
కార్యకర్తల నేరివేసి-
త్యాగపూరిత, నిర్మాణ దక్ష నాయక,
కార్యకర్తల తీర్చిదిద్ది-
నేటి సమస్యల సముద్రంలో
సామరస్యత, పనితనం, స్వయం సమృద్ధుల అలలపై
జాతి సమైక్యతా ఓడలో
స్త్రీ, పురుష జన ప్రయాణం
మానవతా హర్మ్యాలకు,
సోషలిజం తీరానికి - క్రొత్త సంవత్సరాన

రచనా కాలం : 27-12-90

# వేగుచుక్క

శాంతి రక్షణకు
అశాంతి భక్షణకు
మొక్కవోని వీరులం
నీతికి కాపలా
అవినీతికి దాపల
అడుగడుగునా ఉండే వేగులం
దేశ సమగ్రతకు
ఆమూలాగ్రం_
అహర్నిశలు అందలం పడతాం
విచ్ఛిన్నతకు వుంటాం ఆమడదూరం
ముందుకు సాగడం
ముమ్మాటికి నిజం! నిజం!! నిజం!!!
జనం కోసం మేం!
జనంచేత మేం!!
జనం మధ్య మేం!!!
జాతి నేత్రం విప్పిచూడగ
జాతి జడతను పారద్రోలగ_
ఎర్రజండా చేతపట్టిన వేగుచుక్కలం
మానవజాతి మనుగడకై నిల్చిన సజీవ మూలికలం

రచనా కాలం . 28_7_1987

ప్రజాశక్తి దినపత్రిక 31_1_1988
ఆదివారం అనుబంధంలో ప్రచురితం

# మళ్ళీ అదే...

మతం పరదా వెనుక
పాతివ్రత్యం పేరుతో 'సతి'కి చితి.
ప్రజాస్వామ్యం మాటల కోటలో
ప్రజారక్షణ పేరుతో—
సైన్యం కవాతుతో—
"ప్రజా గొంతుకుకు" ఉరి.
'ఖలిస్తాన్' వాదుల హత్యల మేళంతో
అవినీతి అసమర్థతల తాళంతో
దేశదారిద్ర్యరేఖను పైపైకి తీసుకెళ్తూ
వాగ్దానాల డేరాల క్రింద
విచక్షణ రహిత, విశృంఖల పాలన వేదికపై
ఎన్నిసార్లు ఛీ! కొట్టినా —
ఎన్నిసార్లు మొహంమీద ఉమ్మేసినా —
ఈశాన్య భారతంలో
అధికారం వనితతో
నడుం విరిగిన, నపుంసకుడి పెళ్ళి
దేశానికి దాపురించిందొక పాడుకాలం మళ్ళీ.

రచనా కాలం : 6-2-'88.

ప్రజాశక్తి, దినపత్రిక, 21-2-'88 ఆదివారం సంచికలో ప్రచురితం.

# దర్పణం

ఇన్ని రోజులూ
తన మొహాన్ని చూచుకోని నేత
ఎలక్షన్ల రాత్రి గడిచాక
ఓట్ల లెక్కింపు ముగిసిన పగటిపూట
తీర్పు దర్పణంలో చూచుకున్నాడు తన మొహాన్ని.
అది తన మొహమేనా అని అనుమానం వచ్చింది.
ఇన్నాళ్లూ చూచుకోవటానికి తీరిక లేనందుకు సంతోషించాడు
తీరా తీర్పుదర్పణంలో
తనను తన మొహాన్ని, దేహాన్ని చూచుకొని
వ్యాకులపడ్డాడు—
సక్రమపాలనా తైలం లేనిజుట్టు—
పదవనే రేజరుతో, అవినీతి బ్లేడుతో
సరిగా తెగని గడ్డం
కులతత్వాల పుసులు తోడుతూ కళ్ళు—
అహంకారం ధూళితో పూడిన చెవులూ—
అరాచకపు పొక్కులలో నిండి గాలి పీల్చలేని ముక్కు—
ఆత్మవిమర్శనా భ్రమతో తోమనందున
అర్థంపర్థలేని వాగ్దానాలతో
అసమర్థపాలనా వాసనలు వెదజల్లే నోరు—
పైకి తెల్లగావున్నా శవానికికప్పే వస్త్రాలను గుర్తుకుతెచ్చే బట్టలు
తన అనుచరుల్ని సైతం అదలించలేని వూసచేతులు
స్వార్థవుటాటల్లో వంగిన వెన్నూ—
మితిమీరిన తిండితో ముందుకు దూసుకువస్తున్న పొట్టా—
ప్రజల్ని తిరోగమనం పట్టించడంలో రాటుదేలిన కాళ్ళూ—

మొత్తంగా—
పనికిరాని వస్తువుగా—
పారేయవలసిన శాల్తీగా—
తీర్పు దర్పణంలో
తన్ను తాను చూచుకున్న నేత
నేడో రేపో పూర్తిగా రాలనున్న కాత:

రచనా కాలం : 13-12-'89.
ఐక్య ఉపాధ్యాయ ఆగస్టు 90 సంచికలో ప్రచురితం.

# క్రొత్త సంవత్సరం

కళ్ళు మూసుకున్నా, చీకటిని కప్పుకున్నా
మెదడు మేల్కొనే వుంది —
నిద్ర రావటంలేదు, చింతాముద్రపీడటంలేదు
ఒకచోట కిరాయి కిరాతకులకు
రైలుపెట్టెలో సజీవ దగ్ధులైన
అసహాయకుల ఆర్తనాదాలు
ఒకచోట వేర్పాటు ఉగ్రవాదులకు
బస్సులో మూకుమ్మడి హత్యలకు గురైన
మామూలు ప్రజల ఆత్మఘోషలు
ఒకచోట రామ్ రహీమ్ భక్తుల కొట్లాటకు
నిద్రిస్తున్న ముసలి, బాల-స్త్రీపురుషుల
ఘోర హత్యాకాండ దృశ్యాలు
ఒకచోట అధికారానికై అడ్డదారులు త్రొక్కిన
వెన్నుపోటు దార్ల
అద్దె రౌడీలకు ఆహుతైన అన్నార్తుల గావుకేకలు
ఒకచోట విశృంఖల మనోవికారాల అధికారులు
సాగించిన దమనకాండకు గురైన అధికార,
అనధికార జీవుల నిస్సహాయ రోదలు
ఒకచోట అడవి అన్నలమంటూన్న వాళ్ళ చర్యలుకు
మధ్య మధ్య నలిగిపోతున్న పౌరుల ఆవేదనలు
అన్నిచోట్ల అభద్రత  అశాంతి! అరాచకం!
అసెంబ్లీల్లో పార్లమెంటు సభల్లో
ఊహించరాని మార్పులు
'సందట్లో సడేమియా' లాగా బడా వ్యాపారులు

సమయానుకూలంగా పెంచుతున్న జీవితావసర
వస్తువుల రేట్లు —
క్షీణించిన విలువల దేవతా వలువలు ధరించిన సమాజంలో
పిల్లల, యువకుల ప్రవర్తన వేస్తున్న కాట్లు
తెచ్చిన సంబారాలన్నీ సగంరోజులికి సరిపోగా
మిగతా సగాన్ని ఎలా గడపాలని ప్రశ్నించే
సతీమణి పోట్లు—
సగటు భారతీయుడి జీవన పథంలో
పదే పదే సంతోషం తెరకు పడుతున్న తూట్లు—
ఇవన్నీ ఉన్నా
క్రొత్త సంవత్సరం వస్తుందన్న తలంపులో
క్రొత్త సంవత్సరం బాధలు తీరుస్తుందన్న ఆశ
వీడని
సగటు భారతీయుడు
పట్టు సడలని సగటు భారతీయుడు

రచనా కాలం : **28-12-'90**

# చదవండి! చదివించండి!!

చదవండి! చదవండి!! చదవండి!!! చదివించండి!!!
జీవితాన ముందుకు సాగండి! సాగండి!!
నాగరికతకు మలిమెట్లు అక్షరాలు
మన జీవితాల మార్చేసిన అక్షరాలు
సంకేత శాస్త్రానికి తొలిపలుకులు అక్షరాలు
ఆదిమానవుని కేకకు రూపిచ్చిన అక్షరాలు
అక్షరాలు! అక్షరాలు! ॥చదవండి॥

భావాలను భాషలోకి అనువదించు అక్షరాలు
తరతరాల సంస్కృతులను పదిలపరచె అక్షరాలు
గ్రుడ్డివాడు సైతం చూడగలిగిన అక్షరాలు
మూగవాడు సైతం మాట్లాడే అక్షరాలు
చదువుకు ప్రాణం - అక్షరాలు - అక్షరాలు
అక్షరాలు! అక్షరాలు!! ॥చదవండి॥

నిరక్షరాస్యత చీకటిని తరమండి! తరమండి!!
నిరుద్యోగ జ్వాలల్ని - కులతత్వపు మంటల్ని!
తీవ్రవాద రోగుల్ని - తంత్ర మంత్ర వాదుల్ని
మన సంఘపు బాటనుండి కూల్చివేయ త్రోసివేయ
॥చదవండి॥

రచనా కాలం : 31-9-1990.
చెకుముకి; అక్టోబర్ - 90 సంచికలో ప్రచురితం.

# లేదు సమయం

ప్రతి కక్షి వ్యూహానికి
ప్రతికక్షి శక్తులికి
"ఎదిరి"గా ఎదగడంలో
నిమగ్నమైనారు___
లేదు సమయం _ రాజనీతి దర్శనానికి.
చేయబోయే సంతకానికి
రాబోయే లంచాన్ని
ఎలా పంచి, ఎలా ఖర్చు పెట్టాలని
యోచిస్తున్నారు___
లేదు సమయం _ ఉద్యోగ నిర్వహణకు.
సరుకుల కల్తీకి
కల్తీలను. కల్తీ మనుషుల్ని
కల్తీని చలామణి చేసే యంత్రాంగాన్ని
తయారిస్తున్నారు
లేదు సమయం _ వినియోగదారులపట్ల బాధ్యతకు.
చదువుకొనేవాళ్ళకు
చదువమ్మకం కోట్లు కట్టి
సీటు రేటు నిర్ణయాల్లో
మునిగినారు
లేదు సమయం విద్యాబోధనకు.
కొనుక్కున్న మొగుణ్ణి
కొడుకు పుట్టాక
అత్తింటి వారందర్ని తోసేసే
ఆలోచన్ని పచనం చేస్తున్నారు
లేదు సమయం - ఇంట్లో వండి వార్చేందుకు.

ఓట్లు కొనుక్కొని
సీట్లు సంపాదించి
పదవికొచ్చి - పెదాలు
తడుపుకొంటున్నాకు
లేదు సమయం - ప్రజాసేవకు.
బడిలో పరీక్షల్లేక
ఎలాగో డిగ్రీ వచ్చినా వున్నవ్యవస్థలో వుద్యోగం లేక
'ముక్కోణం' వుణ్యాన
తల్లిదండ్రుల నిస్సహాయతలో
చుట్టూరా కలుషిత వాతావరణంలో
ఏమారుతూ—
సోమరినైన్నాకు—
లేదు సమయం - 'బాధ్యతకు'కు
తరం మారినా
భారం మారక—
ముఖ్య సమస్యల్ని ముట్టుకోక
గిడసబారిన
భారత జాతినేతకు
లేదు సమయం - వృద్ధి చెందటానికి
అందుకే
ఈ రాజకీయ నాయకుల్ని—
ఈ లంచగొండి ఉద్యోగుల్ని—
ఈ కల్తీ వ్యాపారుల్ని—
ఈ చదువమ్మే ఉపాధ్యాయుల్ని
ఈ అతితెలివి ఆడవాళ్ళని—
ఈ వ్యాపార ప్రజాప్రతినిధిని—

ఈ సోమరి యువతను
ఈ గిడస బారిన నేతను—
ఉపేక్షించటానికి
క్షమించటానికి
లేదు సమయం ప్రజలకు
లేదు సమయం ప్రజలకు

రచనాకాలం: 1-1-'89

అధ్యయన వేదిక, ప్రత్యేక సంచిక, 1989లో ప్రచురితం

# నీవు - నేను

నన్ను సాధించాలని నీ పట్టుదల
నన్ను జయించాలని నీ ఆరాటం
నన్ను మట్టి చేయాలని నీ ఉబలాటం
కాని___
నా చలనంలో వీగుతుంది నీ పట్టుదల
నా విజయంతో అంతరిస్తుంది నీ ఆరాటం
నా పోరాట ఉనికిలో మసి బారుతుంది నీ ఉబలాటం
నీ పేరు మతమైతే
నేను శాస్త్రాన్ని
నీవు వేర్పాటు వాదివైతే
నేను సమైక్య వాదిని
నీవు పెట్టుబడి శక్తుల నియంతృత్వానివైతే
నేను శ్రామిక నియంతృత్వాన్ని
నీవు అసత్యం
నేను సత్యం
నీవు క్షరం
నేను అక్షరం

రచనాకాలం : **14_8_1989**

ప్రజాశక్తి దినపత్రిక, **3_9_89** ఆదివారం సంచికలో ప్రచురించింది

# వ్యక్తిత్వం

ఒక బాబా కాళ్ళముందు
దేశాధినేత వినమ్ర మోకరింపు
ఒక రాష్ట్రాధినేత చేతుల్లో
ఒక తంత్రగాడి మంత్రదండం
ఒక 'ఆయారం' నెత్తిమీద
పురుగులోడుతూ కుళ్ళుతూన్న పార్టీ కాయం
ఒక ఉగ్రవాది మెదడులో
ముక్కలవుతున్న ఆశయాల అద్దం
ఒక మతాధిపతి ముంగిట్లో
మతపిచ్చెక్కిన జాగిలాల కోరలకు
బలైపోయిన అమాయకుల శవాలు
అయినా —
దేశం దేహంలో దృఢమౌతున్నది
రుగ్మతల్ని తట్టుకుంటూ
లౌకిక, వామపక్ష వ్యక్తిత్వం

రచనాకాలం : 12-12-'90

26-12-90 ఆదివారం ప్రజాశక్తి దినపత్రికలో ప్రచురించింది.

# తేలవాల్సింది

కవి సమ్మేళనానికి కవిత వ్రాద్దామని కూర్చున్నాను
దేనిమీద వ్రాయాలో తోచలేదు
ప్రేమమీద వ్రాద్దామనుకుంటే—
ఈనాడు 'ప్రేమ'న్న రెండక్షరాలూ పీకలు తెగివున్నాయి.
భావకవిత్వం వ్రాద్దామనుకుంటే
నిన్ననే భావుకతకు కాళ్ళు తెగాయి.
అభ్యుదయ కవిత్వం వ్రాద్దామనుకుంటే
మొన్ననే అభ్యుదయానికి అర్థం ముక్కలై పోయింది.
పోనీ—
దిగంబర కవిత్వం వ్రాద్దామనుకుంటే
దిక్కులన్నీ అవసరాల చొక్కాలు తొడుక్కున్నాయి.
విప్లవ కవిత్వం వ్రాద్దామనుకుంటే
ఇప్పుడే - విప్లవాల వీరులు పాలతో స్నానిస్తున్నారు.
ఇక ఉద్యమాల కవిత్వాల జోలికి పోను
నా గురించి వ్రాసుకుంటే
వినేవాడు లేడు.
ప్రక్కవాడిని గురించి వ్రాద్దామనుకుంటే
పట్టాలు లేక వాడికి నిద్రపట్టటం లేదు.
పెరిగిన ధరల గురించి వ్రాద్దామనుకుంటే
అవి భూగ్రహంలో ఎక్కడా కన్పించలేదు.
దేశభక్తి గీతం వ్రాద్దామనుకుంటే
దాని తాజా చిరునామా దొరకలేదు.
రాజకీయ నాయకుల గురించి వ్రాద్దామనుకుంటే

ఎనభై శాతం మంది పిచ్చివాళ్ళకన్నా అధ్వాన్నంగా
ఎనభై శాతం మంది తాగుబోతులకన్నా అధ్వాన్నంగా
ఒకరిపై మరొకరు బురద జల్లుకుంటున్నారు.
ఒకరిపై మరొకరుపడి బట్టలు చింపుకుంటున్నారు.
వాళ్ళ మధ్యకుపోతే — నా బట్టలు చినుగుతాయని
వాళ్ళనీ వదిలేసాను — ఛీత్కరించి
ప్రభుత్వ పథకాలగురించి వ్రాద్దామనుకుంటే
పథకాలన్నీ కాగితాల మీాదనేనని కలెక్టర్లు చెప్తున్నారు.
వాటినీ వదిలేసాను - చమత్కరించి
దూరదర్శన్ మీాద వ్రాద్దామనుకుంటే
అది నా కింకా సుదూరంలో వుంది
ఆకాశవాణి మీాద వ్రాద్దామనుకుంటే
అదినాకు అవకాశమే యివ్వలేదెప్పుడూ

చివరికి

ప్రజలమీాద వ్రాద్దామనుకుంటే
వాళ్ళు — అన్ని పార్టీల 'మీాటింగు'లకు వస్తారు
అన్ని పార్టీల "బంద్"లను పాటిస్తారు
అన్ని పార్టీల ప్రణాళికలను వింటారు
అందరి దేవుళ్ళకూ మ్రొక్కుతారు

ఇంకా తెలివి మీారితే—
కాలాన్ని గందరగోళం చేస్తారు
అందుకనే—
అర్థంకాని ప్రజలజోలికి వెళ్ళలేదు—
బ్రతికుంటే బజ్జీలమ్ముకొని బ్రతకొచ్చని,

అయినా
నా పిచ్చిగాని
నేడు
"కవి సమ్మేళనం" సజీవమా?
'కవిత' సార్థకమా ?
కవి విలువైన వాడా ?
ఇవి తేలాలి ముందు
ఆ తర్వాతనే—
నా కవిత.

రచనాకాలం : 14-8-1989

# కన్నీరు

కన్నీరు, నిరాశ లోతుల్లోంచి
హృదయంలో పుట్టి, కంటి కొలకవైపు
గుమిగూడి టపటప చెక్కిళ్ళపై రాలే కన్నీరు.
ఎదలోని బాధల గాథలను, గాయాలను
కడిగివేసి వెక్కిళ్ళ కట్లతో సేదతీర్చే కన్నీరు.
ముక్కుసూటిగాపోయే మనిషి అభిమానానికి
దెబ్బతగిలినపుడు వచ్చి పరిహసించే కన్నీరు.
గండశిల గుండెను పిండి పిండి కండ(ర)గుండెగా
మార్చి కరుణ నింపి తానావిరియైపోయే కన్నీరు
కడుపు కోతకు ఆకలి కత్తిపోట్లకు
ఆరని స్మృతుల మంటలకు కారే రక్తకన్నీరు
పట్టని ఆనందమున కట్టలు తెంచుకొని
హృదయస్పందనకు ఊతనిచ్చి వచ్చే తృప్తి కన్నీరు
అమిత విషాదరస ఘట్టమందు
ప్రముఖ తారకు రాకరాక వచ్చే గ్లిసరిన్ కన్నీరు.

# తెలుగు కలం పాళి చిట్లకొట్టవద్దు

"విప్లవం" ఎక్కడ ?
ఇక్కడే !
ఎందుకు ?
"ఎందుకేమిటి సంఘంలో మార్పుకు"
"సంఘంలోని ప్రతివాడూ
సర్వసమానత్వానికై పోరాడటానికి !"
"అయితే ఏంచేస్తున్నావు ?"
విప్లవ గీతాలను పాడుతున్నాను !
"కాదు అరుస్తున్నావు"
"విప్లవ కవితలు వ్రాస్తున్నాను !"
"కాదు ఉద్రేకపు గీతాలు గిలుకుతున్నావు"
అయ్యో ! పిచ్చివాడా !
విప్లవం విప్లవం అంటూ
గొంతు పగిలేట్లు
గుండె పగిలేట్లు
నీ గీతాలు, నీవు జాతి చైతన్యానికని రాసే
నీ గీతాలు, క్రోధంతో,
కసితో, అక్కసుతో
"విప్లవ కవిత్వం ఇది" అని బోర్డు
పెట్టుకు రాస్తేగాని విప్లవం కాదన్నమాట
విప్లవ కవిత్వం కాదన్నమాట
ఓరి పిచ్చివాడా !
ఏం మళ్ళీ పిచ్చివాడా ! అంటున్నావని
తెల్లబోయావేం

విప్లవం ఇప్పుడే రాలేదు
సాంఘిక విప్లవం ఎప్పుడో వచ్చింది
సాహిత్య విప్లవం కూడ వెన్నంటి వచ్చింది
విప్లవం అంటే ?
మార్పు
ప్రాత దనంనుండి క్రొత్తదనంకు గల మధ్యదూరం
ఒక Active Process
ప్రాచీనం నుండి
ఆధునికానికడుగిడుతుంటే
అది విప్లవం పొయ్యేకాలం అన్నాడు పౌరాణికుడు
ఛందస్సువదలి
వచన కవితను రాస్తే
సాంప్రదాయం తెలియదు
అసలిది కవిత్వమేకాదు పొమ్మన్నాడు సాంప్రదాయకుడు.
వచన కవిత్వం నిల్చింది
వచన కవిత్వంలో భిన్నరీతులు తెలిసాయి
సామాన్యుని కామన తీరాలని
సామాన్యుడి కడుపునిండాలని
సామాజిక వ్యవస్థ మారాలని
స్వాతంత్ర్యంలో సంపూర్ణత్వం రావాలని
ఎందరో కవులు ఘోషించారు
అభ్యుదయం ! అభ్యుదయం ! అని అరచారు.
అదీ విప్లవమే అన్నారు (కొందరు) ఆనాడు
మొన్నటిదాకా అభ్యుదయమట (కొందరు)
మరి నేడు
విప్లవమట

కాని వాళ్ళకి మందు వేసుకుంటేనేగాని మనస్థిమితం ఉండదట
యుఫోమ్ బెడ్స్ మీదనే నిద్రపోతారు
లేకపోతే పాపం ఆరోగ్యం చెడుతుంది
కారులో తప్ప మరెందులోనూ నేలమీద తిరగరు
వందల ఎకరాల సేద్యం చేస్తారు
టెర్లిన్ మాత్రమే తొడుగుతారు
కాని వారికి కావాలట (వారివట)
కమ్యూనిస్టు భావాలు
come you next=నా తరువాతనే నీవు
= కమ్యూనిస్టు
భూములు పంచాలట Land grabbing
తన భూములు మినహాయింపట
అంతా దుర్మార్గులట
తనవాళ్లు తప్ప
అందరు అధికారం కోసమట
తానుమాత్రం కాదట
మరి యీ తాపత్రయం ?
"చేతకాక మూలకూర్చున్న ముండా"
తోకముడిచి పారిపో చవటా !
నీకు దమ్ముల్లేవు
నీకు రొమ్ముల్లేవు
కాగితపు బొక్కలతో తృప్తిపడే
నపుంసకుడివి నీవు
దద్దమ్మవు ! దిగు దిగు !
ఓ పందికొక్కా

అంటూ ఈ మాదిరిగా వ్రాస్తేనే సంఘం మారదు
జుగుప్సాకరంగా బూతుకవిత్వం వ్రాస్తేనే సంఘం మారదు
ద్వంద్వార్థ పదాలు వాడితేనే సంఘం మారదు
అభ్యుదయ కవిత్వం చెప్పినా
దిగంబర కవిత్వం చెప్పినా
పైగంబర కవిత్వం చెప్పబోయినా
మరోకవిత్వం చెప్పబోయినా
అన్నిటి గమ్యస్థానం ఒక్కటేగా
అందరికీ అంబలి సరిగా అందాలనేగా
అందరి కవితాస్పందనలోని వేడి నిట్టూర్పులు ఒకటేగా
మరి ఎందుకు
ఈ భేదం, భేదం వద్దు వద్దు
తెలుగు కలం పాళీ చిల్లుకొట్టవద్దు.

రచనా కాలం : 27_8_1970

ఆంధ్ర జనత (దినపత్రిక) 20_6_71 సంచికలో ప్రచురితం.

# ఓటు

ఓటు
పౌరుల జీవనానికొక రక్షణ కోటు
ఆ హక్కు పొందడానికి ఆగాలి 18 సం॥ల పాటు
ప్రజాస్వామ్యంలో వుంది దీని సరైన చోటు.
ఓటు
అభ్యర్థులు ఎక్కవలసిన బోటు
అసెంబ్లీ సభ్యత్వానికి దాటవలసిన గేటు
అధికారంలోకి రావడానికి నిర్ణయిస్తుందిది రేటు.
ఓటు
దీనికోసం పెడతారు నాయకులు వాగ్దానాల రికార్డు ప్లేటు
అవసరమైతే వదులుతారు నోట్ల మసాలా ఘాటు
ఆ తరువాత నిజం, తిరిగిచూడరు మరొకమారు ఐదేళ్ళపాటు.
ఓటు
దేశంలో ఉన్న ఎన్నికల జబ్బుకు మందుల అందుబాటు
కాని, అజాగ్రత్తగా వాడితే వస్తాయి సైడ్ ఎఫెక్ట్సు
బయట ఎంత మంచిగా, ఎంతగా బ్రతికినా ఐక్యరాజ్య సమితిలో
వీటోతో ఓడిపోతుంది ఓటు.
అందుకే___
కావాలి
ఓటు
గంట గంటకు పార్టీ మార్చే అంట్ల వెధవల్ని త్రుంచే వేట
మాటల గారడి గుంటనక్కల్ని గద్దె దించడానికి ఓ పట్టు
సమసమాజావిర్భావానికి ఈ దేశం ప్రజలు ఎక్కవలసిన వివేచన మెట్టు.

రచనా కాలం : జనవరి, 1972.

# అప్పు

అప్పు – అది ఏమాత్రం కాదు నేడొక తప్పు
అప్పు – అబ్బ దీన్ని పుట్టించేవాడు తీస్తాడు రొప్పు
అప్పు – నేటి భారతావనికున్న ముప్పు
అప్పు – సర్వాంతర్యామి, సకలబాధానివారిణి
అప్పు – చేయనివాడొక కుర్రరిస్టై పుట్టు.

రచనా కాలం : 2-8-1991.

# డబ్బు

డబ్బు—
మనుషులనీ, మనసులనీ కొనేస్తుంది
డబ్బు—
త్రికాల మారక సాధనం
త్రిదిశల జీవన వాహనం
త్రివర్గ ద్వేష కారణం
డబ్బు—
ఇది వున్నవాడి దోషాలను
ద్వేషాలను, రోగాలను
మంచులా కప్పివేస్తుంది
మందులా పనిచేస్తుంది
పెద్దమనిషిలా బ్రతకనిస్తుంది
డబ్బు—
ఇది లేనివాడు వేస్తాడు
ఐశ్వరం ఆకాశానికి
ఆశల నిచ్చెనలు

రచనాకాలం : **16-1-1972**

చుక్కాని వారపత్రిక, 17-2-'73 సంచికలో ప్రచురించింది.